# హరిజన శంఖారవం



రచన

శంకర్ దేవ్, ఎం. ఏ.,

వేదాలంకార్



ప్రకాశకులు.

ఆర్యసాహిత్య పరిషత్తు

నం. 10 ఎం. ఎల్. ఏ. క్వార్టర్సు

హైదరాబాదు.



మీరు ఇంటింటికి పొండి, ఊరూరు తిరగండి, పల్లె పల్లెలో
ప్రవేశించండి, ప్రతి వ్యక్తితో మాట్లాడండి,
ఉద్రేకించండి. ప్రసంగించండి, ప్రలాపించండి,
వేడుకొండి. మొత్తానికి ఏకీభవించండి.

# ఒక్క మాట

ఈ కాలములో దళితలను సంఘటితపర్చుట, సరియైన మార్గంలో నడుపుట, చాలినంత రాజకీయ విజ్ఞత చేకూర్చుట నేటి సంఘ నాయకుల ధర్మంగావున్న కారణముతో ఈ చిన్న పుస్తకం 'హరిజన శంఖారవం' అనే పేరుతో ప్రచురించడమైనది.

పుస్తకము చిన్నదిగాను, శైలి అతి సులభముగాను, గ్రామీణ ప్రజానీకానికి చక్కగా అర్థమయ్యేటట్లు వ్రాయడమైనది. కాలము మారిపోగా, రాజకీయ సాధనాలకు ఈ దళితలను విభిన్న రాజకీయ పార్టీలు తమతమ కొరముట్లుగా వాడుకోదలచిన అదనులో, ఈ పుస్తకము హరిజనులకు, కనువిప్పుముగా ప్రకటించబడినది.

అధిక సంఖ్యాకులైన హరిజనుల పురోభివృద్ధికి యీ చిన్న పుస్తకము, ఎంతో ప్రయోజనకారిగా ఉంటుందని ఆశించుచున్నాను.

గ్రంథకర్త.

# హరిజన శంఖారవం

## విజ్ఞప్తి



నా ప్రియమైన హరిజన యువకులారా!

నాలుగుమాటలు చెప్పదలంచుకొన్నాను. ఎవరికో తెలుసా?

జాతి అభిమానానికై, జాతి ఉద్ధారణ కొరకు, ఎవరి రక్త నాళాలు ఉబుకుతున్నాయో, ఎవరి హృదయాల్లో ఆరని అగ్ని జ్వాలలు మండుతున్నాయో, అట్టి హరిజన యువకులకే యీ హితవులు, హెచ్చరికలు, ఉద్బోధలు.

కాబట్టి మీరందరు నాతోకలసి యీ దిగువవిధంగా గీతాలు పాడాలి?

తే. గీ. నేను స్వేచ్ఛా విహారిని, లేని పోని
బంధనములకు లోనగు - వాడగాను
గగనమార్గాన నెగయంగ—గలను భూమి
గర్భమును చీల్చుకొనిపోవ—గలను నేను.

అలా అనలేకపోతిరా, స్వేచ్ఛ మీ యందు ప్రవేశించలేదన్న మాట. స్వాతంత్ర్య వాతావరణంలో మీరింకా సంచారంచేయుట లేద న్నమాట. అంటే నిద్రావస్థలో ఉన్నారన్నమాట!

లెండి! మేల్కొండి!! కండ్లు తెరవండి!!! ముందూ వెనకా చూడండి! మీరు ఎక్కడఉన్నది, ఏమిచేయుచున్నది ఏమేమి చేయలేకపోయినది గ్రహించుకోండి. అదిగో, తూర్పు కొండపై నుదయించు బాల భాస్కరుని, కిరణాలను, స్మరించండి. వేడికిరణాలు మీపై ప్రసరించుచున్నవి. దుప్పటిముసుగులో ఇంకా ముసికి నిద్రించదగునా? లెండి, దుప్పటి దులిపివేయండి. కండ్లుతెరచి బాగా చూడండి మీ సహచరులు, సమకాలికులు ఏమిచేయుచున్నారో చూడండి! యోచించండి!

వారు వేకువనే లేచినారు. హడావుడితో పని పాటలు సవరించుకొన్నారు. మీరు మందగించి, మైమరచి, నిద్రించి కలలుకంటున్నారు. అట్టి సోమరితనాన్ని దులిపివేయండి, లెండి, చూడండి. కాస్త కాళ్లాడనీయండి!

మీ కండ్ల మసకలవల్ల, మీ దృష్టి మాంద్యంవల్ల, మీకు, మీ వారికి కలిగిన దురావస్థ మీకర్థమగుటలేదు. వారి నుద్ధరించే బాధ్యత మీపైన, లేదనా మీరనుకోవడం. మీ ఆత్మబంధువులు హరిజనులు, ఎన్నియుగాలనుండి, చెడి, పడి, దుర్భరావస్థలో మూల్గుచున్నారో మీరెప్పుడైనా ఆలోచించినారా? వారు అట్లా, ఆ పాతాళంలోపడి నవిసిపోవలసిందేనా? వారు లేవవలెననుకోండి, అది ఎవరిపని? మీ పని, మీ విధి, మీ కర్తవ్యం. లెండి, నడుముకట్టండి. సిద్ధులు కండి ఇప్పటికే చాలా ఆలస్యమైపోయింది. ఇంకా ఆలస్యం చేయవీల్లేదు. వ్యవహారాలు ముదిరిపోయాయి. పునః సమర్థన దుర్లభం. మీ జనులను ఉద్ధరించే కంకణంకట్టండి. గట్టిగా పట్టుపట్టి ఒట్టుతినండి దృఢ నిశ్చయులై నిలవండి. వేలకొలది సంవత్సరాలనుండి, తెరలు తెరలుగా

పొరలివస్తున్న యీ దురవస్థను పటాపంచలుగావించ నిశ్చయించుకోండి.

మిమ్ములను హింసించి, బంధించి, అణచిపట్టి విలపింపజేసినదినాలు దాటిపోయాయి. ఇప్పుడు మీరు స్వేచ్ఛావిహారులు. మీ ముందుండిన అడ్డంకులు, ఆటంకాలు, అభ్యంతరాలు, అన్నికూడా తొలగిపోయాయి. మీలో నూతనశక్తి ప్రవేశించినది. మీయందు ఉద్రేకజ్వాల ఉద్భవించినది. దానిని వెలిగించండి, మండనీయ్యండి, నాలుగు దిక్కులు మిమ్మునావరించిన చీకట్లను వెళ్లగొట్టండి. మీ శక్తిని, మీ ఆవేశాన్ని, మీ ఆంతరంగిక ప్రశాంతిని, ప్రాబల్యాన్ని, మీ పవిత్ర జ్వాలాయమానాన్ని ఎదిరింపగల బలము ఎవరికున్నది? అట్టి శక్తి యిక జన్మింపబోదు. ఆలా అడ్డగించి పోటీకి, పోటీగా నిలచే వాళ్లులేరు. పూర్వమువలె, ఎవరైన హరిజనుల, సాంఘిక రాజకీయ ప్రగతిని, నిరోధింపప్రయత్నించిరా, వారి ప్రయత్నం నిరర్థకము, నిష్ప్రయోజనము. వృథా ప్రయాస! మీరు యింకా, మీ కుంకిమంచాల్లో నిద్రిస్తూఉండగా, మీకొరకు ప్రభుత్వంవారు ప్రశంసనీయముగు చట్టాలను సృష్టీకరించినారు. భారతరాజ్యాంగం, మీకు అన్ని అధికారాలు సమకూర్చింది. కులీనులన బడ్డవాళ్ళ కెన్ని రాజకీయ సాంఘిక, హక్కులున్నవో, మీకుకూడా అవన్నిఉన్నవి. మొన్నటివరకు మీరెట్టిస్థితిలో ఉంటిరో మీకు జ్ఞాపకముందా? అప్పుడు మీకు చదువు లేదు, చదువుకునే హక్కు కూడా లేదు, చదువు చెప్పేవారూ లేరు. చెప్పేవారు కారు. పుస్తకాలుపట్టుకొనే అధికారమూ లేదు. గుళ్ళలోకి పోయి, పూజలు చేసుకొనే అర్హతాలేదు. సర్వజనులకొరకైన బావులలో నీళ్ళు తీసుకో

లేరు. హూటకూళ్ళలో భోజనంచేయలేరు. ఇంతఎందుకు, నడిబజారులో సాహసంగా తలఎత్తి, పంచచెరగులు కిందికి దిగజార్చి, కాళ్ళకుజోళ్ళు కలిగి, నడువగలిగారా? భారతదేశ స్వాతంత్ర్యంతోపాటు, హరిజనులకు, సాంఘిక స్వాతంత్ర్యంకూడా కలిగింది. చీకటికాలంపోయింది. నిరాటంకంగా, బహిరంగబావులలో నీళ్ళుతోడుకొనవచ్చును. అన్ని మందిరాలలో ప్రవేశించి, మీ యిచ్ఛాపూర్వకంగా దైవధ్యానముచేసి ప్రార్థించుకోవచ్చు. మంగలి మీకు క్షౌరంచేయననలేడు. చాకలి బట్ట లుతుకననజాలడు. అంటే శిక్షకు పాత్రులౌతారు. భారతరాజ్యాంగము 17 వ సూత్రంప్రకారం మీకీ దిగువ అధికారాలు కలిగినవి.

౧. హరిజనులు బహిరంగబావులలో నీళ్లు తోడుకొని వాడుకునే హక్కు సేకరించినారు.

౨. పాఠశాలల్లో హరిజన బాలికాబాలురు సవర్ణులతో సమానంగా చదువుకొనే హక్కు పొందినారు.

౩. ఆస్పత్రిలలో మందులు సేకరించుటకు, చికిత్స పొందుటకు అధికారమున్నది.

౪. హరిజనులు సవర్ణుల గుళ్లలో ప్రవేశించి, ప్రార్థించి భజనల్లో పాల్గొనే హక్కులను పొందినారు.

౫. సవర్ణులతో కలసిమెలసి, వ్యవహారాలు జరుపుకొని, హూటకూళ్ల, హోటల్లలో సంచరించుటకు హక్కు కలదు.

౭. హరిజనేతరులకు ఎన్నిహక్కులు గలవో, అన్ని హక్కులు, హరిజనులకు కూడా కలవు.

౮. ఈ హక్కులకు ప్రతికూలంగా ప్రవర్తించినవారికి, ఆరునెలల శిక్ష లేక రూ. 500 జరిమానా విధింప బడును.



# 2. ఐకమత్యసంఘటన

యువకులారా ? మీరు పశువులు కారు. ఆత్మగౌరవము కలిగిన మానవులు. మీకు లభించిన హక్కులు మీరు వినియోగించలేకపోతే, ఆ హక్కులు మీకు ఉంటేనేమి లేకుంటేనేమి ? వాస్తవానికి, మీ హక్కులను మీరు వినియోగించుట లేదు. మందిరాలలో ప్రవేశించే హక్కు మీకు కలిగింది. మీలో తెలివితేటలు కలిగినవారు మందిరాలలో ప్రవేశిస్తున్నారు. మీలో విద్యాగంధము లేనివారు, అనాగరికులు, ఎందరో ఉన్నారు. వారు మీ హక్కులను సమర్థించలేక పోతున్నారు. మందిరాలలోనికి పోరు. దూరాన నిలిచి వెనుక ముందాడుచున్నారు. వారిని నిబ్బర పరచగలిగిన వారెవరు ? మీరేకదా ! వారిని ప్రోత్సహపరచండి ఉద్రేకము పుట్టించండి. అదేవిధంగా బావులలో నీళ్ళు తోడుకోన నివ్వకపోతే, మీరు వెంటనే చర్యతీసుకొనండి. మంచిమాటలతో విషయాన్ని సవరించండి. విషమపరిస్థితులు రానివ్వకండి. మాటలతో పని సాగకపోతే, చట్టమును వినియోగించండి. ప్రతి బావికడ, మందిరము దగ్గర ప్రభుత్వమువారు, చెక్కవలకలమీద వ్రాసి ఉంచిన హితవులు చదివి చెప్పండి. హరిజనులకు హక్కుకలదని వానిపై వ్రాయబడి వున్నది. ఇదేమి తేలికపని కాదు. మీ సమస్తమును సమర్పించుకొనుటకు సిద్ధంగా ఉండండి. బలిదానమగుటకైనా వెనుదీయకండి. కొన్నిమారులు మీరు అవమానింప బడవచ్చు, దెబ్బలు తినవచ్చు, గాయపర్చబడవచ్చు, లారీలక్రింద, రాళ్లక్రింద, నలిగిపోవచ్చు, కాని "శాంతి" మాత్రము మీకవచంగా వాడుకోండి. క్రోధం రానివ్వకండి ద్వేషభావాన్ని పగసాధించే గుణాన్ని,

తృణీకరించండి. విదేశీయుల బంధీకృతంలో పడి మూల్గుచుండిన భారతదేశాన్ని లేపుటలో మహాత్ముడు ఎన్ని అవమానాలు పొంది నాడో, ఎన్ని దెబ్బలు తిన్నాడో ఎన్ని మారులు కారాగృహాలలో చివికిపోయినాడో వేరే మీకు చెప్పవలసిన పనిలేదు. అదేవిధంగా, సాంఘిక బంధనములో పడియున్న హరిజనజాతిని, లేవనెత్తవలె నంటే, మీరు కూడా కష్టాలనుభవించవలెను. గాయములు పొంద వలెను. కృశించిపోయిన మీ జాతికి, మీ రక్తప్రవాహము మీ బలి దానం అత్యవసరం. సిద్ధంగా ఉన్నారా? సాహసిస్తారా? లేక భీతిల్లి, జంకి, పిరికివందలై, పేరులు మార్చుకొని, మతాంతరులై తప్పించుకొని పోతారా? మీ హృదయాన్ని మీరు పరీక్షించుకొండి స్థిరచిత్తులై నిలువండి. ఈ పని మీకు చేత గానిది కాదు. దీనిని సమర్థించుటకొక చిన్న సూత్రమున్నది. దానిని గనక మీరు చేస్తిరా, వెంటనే కృతార్థులౌతారు. అదేమిటంటే, "ఐకమత్యం" "సంఘీభావనం" మీరందరు సంఘీభవించండి. ఏకము కండి. మీలో ఉన్న భిన్నాభిప్రాయాలు అవకతవకలు తీసివే యండి అందరు హరిజనులనే భావాన్ని గంభీరపరచండి. మాల మాదిగ, చక్కిలి, చిందు, అనే ఉపజాతుల భేదాలు మీలో సమసి పోవాలి. మనలో మనము కలసిమెలసి, జీవించలేకపోతే, సవర్ణులతో వాదించగలమా? మాలవాడకు మాదిగవాడకు మధ్య పెద్ద గోడ ఉంది దాన్ని తొలగించండి. ఏకీభవించండి. యువజనులారా, మీరే యీ సంఘ సంస్కరణ సాగించాలి. హరిజనులలో ఉన్న ఆంతరీయ విభేదాలను తీసివేసే యత్నం చేయండి. ఇచ్చిపుచ్చుకొనే సాంప్ర దాయాన్ని కలిగించండి ఉపజాతుల నామకరణాలు నమసిపోవలెను. మనలో మనకు ఎక్కువ తక్కువలు కనబడరాదు. మనయందలి జాతి

భేదాలను బహిర్గతపరచి, సవర్ణులు మనవైపు వ్రేలు చూపుచున్నారు. అస్పృశ్యతను గూర్చి మనము విమర్శించినప్పుడెల్ల, మనలోని లోటులను వారు ఎత్తిచూపుచున్నారు. కొంతవరకు యిది నిజమే. మనలోట్లు మనము మొదట చక్కబెట్టుకోవలెను. మన తప్పులను మనము సవరించుకొనక, యితరులను దూషించడము తగదు. కాబట్టి, యీ పని మీ తలమీద పెట్టబడియున్నది. వృద్ధులైన వారి హృదయాలు మార్చుట కష్టతరము.

వారి కాలము గడిచిపోయినది. ఈ పని మీరు చేయవలసి ఉన్నది. మీరు మీ ఉపజాతులలో పెండ్లిపేరంటాలు చేసుకోండి. కలసి భోంచేయండి. కలసిమెలసి వ్యవహారాలు జరుపుకోండి. కులకట్టు పంచాయతీలలో అన్ని ఉపజాతులవారికి సభ్యత ఉండేటట్టు ఏర్పాట్లు చేయండి. మాలవాడ, మాదిగవాడ, మాలవాళ్ళబావి, మాదిగవాండ్లబావి, అని దూరదూరాన నిలువక, కలసి ఒకే బావినీరు త్రాగండి. అదేవిధంగా, మీ వాడలు, బస్తీలు, వేరువేరుగా గాక, మిశ్రమ గృహాలను "కాలనీల"గా కల్పించుకోండి. పాత అభిప్రాయాలను, పాతపోకడలను దూరపరచి, హరిజనజాతి ఉద్ధరణకు, ఏయట్టి సాంఘికమార్పులు అవసరమో, అట్టి మార్పులను వెంటనే చలామణి చేయండి. ఇది మీ చేతులలో ఉన్నది. పెద్దలవైపు, వృద్ధులవైపు చూడకండి. ఇది గొప్ప సంఘ సంస్కరణ సంఘనిర్మాణము. దీనిపైననే మీ భావికాలపు జీవనము, ఆయురారోగ్యాలు, రాజకీయ, సాంఘిక గౌరవాలు ఆధారపడి ఉన్నాయి. కాబట్టి యువకులారా దీర్ఘంగా ఆలోచించండి.

మీరు ఇంటింటికిపోండి, ఊరూరు తిరగండి, పల్లెపల్లెలో ప్రవేశించండి. ప్రతివ్యక్తితో మాట్లాడండి, ఉద్రేకించండి, ప్రసంగించండి,

ప్రలాపపడింది, నేమకొండి. మొత్తానికి ఏకీభవింపజేయండి. ఒక్క-
సారి యీ ఐకమత్య సూత్రం ఫలితమాయెనా, మిమ్ము నెదుర్కొన
గలిగిన మహాశక్తి, ముల్లోకాలలోలేదు. మీరు నిరాధారంగా లేరు.
రాజ్యాంగ విధానం మీపక్షంగాఉంది. దానిని వంగదీసి, అమలులోనికి
రాకుండా చేయాలని ప్రయత్నించేశత్రువులను, మీరు మీ ఐకమత్యం
ద్వారా ఓడించండి. ఇంతవరకు ప్రభుత్వపు అధికారులకు, హరిజను
లకు సంబంధబాంధవ్యాలు లేవు. అట్టి సంబంధము మీవల్ల కలుగ
వలసిఉంది. మీరు ఎదురాడి పోరాడండి అంటే, ఎవరితోనైనా దెబ్బ
లాడవలెననిగాని యుద్ధము చేయాలనిగాని అనుకోకండి. అది తప్పుడు
అభిప్రాయం. మహాత్ముడు నేర్పినదదిగాదు. బాబూజగ్‌జీవన్‌రాం
కూడా అలా చెప్పలేదు. విద్యావంతులైనవారే, ధనికులే, కులనిష్ఠా
గరిష్ఠులే, యీ చట్టానికి ప్రతికూలంగా నడుచుకొన ప్రయత్నిస్తారు.
రాజ్యాంగంవల్ల మనకేమీ లాభం కలుగకపోయే విధానాలను వారు
కల్పన చేస్తారు. ఇది కొత్తసంగతిగాదు. యుగాలనుండి మీరు దీనిని
అనుభవిస్తూనే ఉన్నారు. పగదీర్చుకొనుట మనపనిగాదు. మనముమూ
త్రము చట్టమును గౌరవించి, అధికారుల మన్ననలకు పాత్రులమై
మంచి చెబ్బరలాలోచించి, "అహింసా పరమోధర్మం"అనే తత్వాన్ని
శిరసావహించి, మన హక్కులను మనము అక్షరాల సంరక్షించుకో
వలె. వాళ్ళకొట్లు తిట్లకు భయపడిగాని, కోపగించుకొనిగాని, మన
శుభ కార్యాన్ని చెడగొట్టుకోరాదు. యథావిధిగా గుళ్ళలోకి పోదా
ము. దెబ్బలుతింటూ పూజిస్తూ కాలము గడుపుదాము. తిట్లు తింటూ
ఊరిబావి నీళ్ళు తోడుకొందాము. చాకలి మంగలివారివల్ల తప్పక
మనము పనులుచేయించుకొందాము. ఎన్నికష్టాలురానీ, ఎన్ని విఘ్న

పరిస్థితులు ఏర్పడనీ, ధైర్యసాహసములతో ముందంజవేయనిశ్చయించు కొందాం.

ఇన్ని ఎందుకుగాని, మీరు చట్టము ననుసరించి, తెలివి తేటలతో పని చేయండి. ప్రభుత్వంవారు మీపక్షాన ఉన్నారు. సాంఘిక ద్రోహులను, దుండగిలను హింసించే భారము వారిది. హరిజనుల హక్కులకు ప్రతికూలంగా ప్రవర్తించేవారికి ఇంతకుపూర్వం చెప్పినట్లుగా, 6 నెలల శిక్ష లేక 5 వందల రూపాయల జరిమానా విధింపబడును.



# 3. అధికులెవరు ?



హరిజనుల్లోగాని, వెనుకపడ్డ యితర జాతుల్లోగాని, ఒకతప్పుడు అభిప్రాయమున్నది. మీరు తక్కువజాతులవారనీ, "లలాట రేఖన పునః పఠియాతి" అని కర్మ గ్రహాచారముపై నాధారపడి, చేతికి ఐదువేళ్ళు ఏలా ఎక్కువ తక్కువగా ఉండునో, అట్లే, మీరు శాశ్వతంగా ఉంటారని అనుకొంటున్నారు. అది తప్పు. ఎక్కువ తక్కువలన్నీ, మధ్యస్థాన నిర్మింపబడినవే. జన్మంతో అందరు సమానులే. పురాణేతిహాసాలవల్లెవేస్తే మన పూర్వీకులందరు మహనీయులనియు, మహామునిపుంగవులనియు తేలుతోంది. నిన్న మొన్నటి చరిత్ర చూడండి. బాబాసాహెబ్ అంబేద్కర్ ఎవరిజాతివాడు? మన భారత రాజ్యాంగాన్ని నిర్మించిన మహనీయుడీ హరిజనజాతివాడే గదా. పంచముడనియు అస్పృశ్యుడనియు తృణీకరింపబడ్డ శ్రీ అంబేడ్కరు అభినవమనువుగా లెక్కింపబడుట హరిజన ప్రతిభకు, ప్రావీణ్యానికి, ప్రబలతార్కాణం. అంటరాని తనమనేది దైవిక నిర్బంధమని భావింప వీలున్నదా ? ఇటువంటి మహాజ్యోతులు మన దేశములో యింకా ఎందరో ఉన్నారు. వారు నీరు గపసిన నిప్పువలె, అజ్ఞాతవాసంలో ఉన్నారు. అందరికి సరిసమానమగు అవకాశాలు తరుణములు లభిస్తే, ప్రజ్వలితమైన జ్వాలలు మన జాతిలోనుండి బయలుదేరగలవు. మాణిక్యపుష్యరాగాలు పనికిమాలిన మట్టితో చుట్టబడి ఉంటాయి గదా. వానిని ఆవరించియున్న మలినాన్ని ఊడగొట్టితే వాని విలువ బయలుపడుచుండును. ఆదేరీతిగా

అజ్ఞానమనే గాఢాంధకారము మనవారి నావరించి ఉంది. అట్టి చీకట్లను, విడదీస్తే, పరిశుద్ధమైన మాణిక్యాలు బయటికి రాగలవు. అప్పుడే అవి బంగారములో అమర్చబడి రాజన్యుల కిరీటాలలో పొదుపబడుచుంటవి. మీసంగతి కూడా యింతే.

. . .

పూజ్యనీయుడగు బాబూ జగ్‌జీవన్ జీవచరిత్ర మీ ముందు స్పష్టంగా కనబడుతోంది. ఆయన స్థిరచిత్తుడు, అచలవీరుడు, స్తవనీయమైన సిద్ధాంతపరాయణుడు. ప్రభుత్వ కార్యక్రమాలను గొప్ప పూచీతో నిర్వహించే ధైర్యశాలి. మరి ఈయన హరిజనుడు కాడా? మనలో వేలకొలది అంబేడ్కరులు, జగ్‌జీవన్‌రాములు కుప్పతిప్పలుగా లేరా? కాని వారు అజ్ఞానాంధకారముచేత, బయటికి రాలేకుండా ఉన్నారు. తెలివితేటలు లేక గాదు, తగిన సదుపాయాలు లేక చేయూతనిచ్చువారు లేక, ఆర్థిక సహాయ శూన్యతవల్ల, అన్నిటికి పైగా, మనము అధములము అంటరానివారము, ఊరి కావలి పూరిండ్లలోనే ఉండవలసిన వారము, పారంపరంగా వెట్టి చాకిరికై జీవించవలసిన వారమనే మూఢత్వముచేత, ముందుకురాలేక పోతున్నాము. అట్టి తప్పుడు అభిప్రాయాలనుండి తొలగండి. మీరందరు ఉన్నత స్థలాల నాక్రమించుకోగరని నమ్మండి. ముందుకు సాగకపోతే, వెనుకనే ఉంటారు. మన బాలికా బాలురు మానవులే. సవర్ణుల పిల్లలకన్న తక్కువ వారని తలంచరాదు. హరిజనజాతి మీ వైపు కాంక్షతో చూస్తుంది. నిస్సహాయస్థితిలో కూలిపోయి, [illegible] సహాయమెక్కడనుండి వచ్చునా యని మీవైపు దృష్టి నిగిడించినది. పడిపోయిన వారిని లేవనెత్తశక్తి గలిగిన వారు మీరే కాన [illegible] [illegible].

నిలవండి, నిలవండి, నిలచిపోరాడండి
పారిపోతే పిరికి పందలంటారోయి
గెలవండి యికముందు గెలుపు మీదేనండీ
పిలవండి నోరెత్తి దళితజాతులనెల్ల
కలసి, సంఘీభావబల పరాక్రమముతో॥నిల॥

మీకు విద్యాబుద్ధి లభియించునందాక
మీ బానిసత్వాలు మాయమౌనందాక
మీ యిళ్లు వాకిళ్లు స్తవనీయమగుదాక
మీ వెట్టిచాకిరీ మిము బాయునందాక
నిలవండి, బలముతో నిలచి పోరాడండి

ఇంకోసారి మీకు, హెచ్చరిస్తున్నాను. అది ఐకమత్యం. మీ యింటిలోని చెత్తాచెదారాన్ని ఊడ్చే చీపురు సంగతి మీరెప్పుడైన విచారించారా? చీపురుకట్టలోని ఒక్క పుడకను విడదీసి, దానితో మీ యిల్లు ఊడ్చిచూడండి, వ్యర్థము. చెత్త ఎక్కడిదక్కడనే ఉంటుంది. సరే అనేక పుడకలను ఏకముగా చేర్చి ఊడ్చిచూడండి. మీ యిల్లు ఈ క్షణ్మాత్రాన శుభ్రమైపోతుంది. దీని రహస్యమేమి? ఐకమత్యం. ఎంతబలవంతుడైనా, తన స్వంతబలముపై నాధారపడితే మోసపోతాడు. "బలవంతమైన సర్పము, చలిచీమలచేతజిక్కి చావదె సుమతీ" అన్న ఆర్యోక్తి మీ స్మరణకు తెస్తున్నాను. ఒక చిన్న చీమ చేయలేని పని నూరు చీమలు కలసి చేయగలవు. ఇది మన అనునిత్య అనుభవము. హిట్లరుయొక్క అహంభావము మీరు విని యున్నారు. ప్రపంచాన్ని పటాపంచలు చేస్తానని విఱ్ఱవీగినాడు. ఐతే, అతని ఓడించినది ఎవరు? ఎవ్వరైన ఒక్కరు ఓడించినారా, కాదు కాదు.

మిత్రమండలివారు అందరు ఏకమై అతనిని ఓడించినారు. రావణా సురుని గాధ కూడా అంతే కదా. సంఘీభవిస్తే సమస్తము సాధ్యమౌతోంది. మీరు వ్యక్తిగతంగా, ఒక్కొక్కరు చేయలేనివన్నీ, ఏకీభవించినచో చేయగలరు. మీకనులముందు అద్భుతం కలుగుట మీరే చూడగలరు. కాబట్టి మీరందరు ఒక్కటై, ఒక జండాక్రిందికి రండి ఒకేశబ్దంతో ఒకే నడకతో ఒకే ఆవేశంతో ఒకే ఆశయంతో ఒకే దృష్టితో నడవండి. ముందుకు సాగండి. తరువాత చూడండి ఏమి జరుగుతుందో !

ఈలాగు ఏకీభవించి ముక్త కంఠంతో పోవడమంటే, ఎవరిమీదైనా యుద్ధానికిగాని, దెబ్బలాటకుగాని పోవాలని నా అర్థంకాదు. అలా మీరు అర్థంచేసుకొంటే పొరబాటు. మీ కర్తవ్యమేమిటంటే, భారత రాజ్యాంగం మీకు యిచ్చినటువంటి, మీ హక్కులను మీరు సంరక్షించుకొనుటయే. వాటి సంరక్షణకై మీరు వీరులై, ధైర్యంతో ముందుకుపొండి. మీ ఆత్మసంరక్షణకై మీ జాత్యోద్ధరణకై మీరేది చేసినా తప్పుగాదు.

మన విరోధులెవరు? వారు వీరంటానికి వీల్లేదు. మన హక్కులను మనము అనుభవించకుండా అవాంతరాలు కల్పించేవారే మన శత్రువులు. వారితో గూడా దెబ్బలాడరాదు. వాగ్వివాదాలవల్ల పనులు జరగవు. తెలివితేటలతో ఏకీభవించండి. సంఘీభవిస్తే జయము మీదే !

అంతేగాదు కార్యరూపకంగా మీరింకొకపని చేయాలి. మీ పల్లె గ్రామాల్లో, బస్తీల్లో, నగరాల్లో, తాలూకాల్లో, జిల్లాలలో ఎక్కడ

వున్నా గాని పీడితులైన హరిజనులను కొంత విచారిస్తూ ఉండండి. మీ చేతనైనంత మట్టుకు వారికష్టాలు రీసివేయ ప్రయత్నించండి. హరిజనుల హక్కులేమిటో, వారికి తెలుపండి. వారి హక్కులు వారికి తెలియంది, వారేమి చేయుతేరు. హరిజనులు పారంపర్యంగా వ్యవసాయదారులు ఈ వృత్తియందు వారు ఆరితేరియున్నారు. వేలకొలది ఎకరాలు, రైతులకై సేద్యముచేసి, పంటలు పండించి, రైతులను రాజులగా మార్చుచున్నారు. పారంపర్యంగా వ్యవసాయంచేస్తూ, వారి ఆయురారోగ్యాలను, తమ రైతులకై దారపోసినా, చేరెడు భూమి నాది అంటానికి వీల్లేని దౌర్భాగ్యస్థితిలో జీవిస్తున్నారు. ఈ స్థితిని ప్రభుత్వం వారు మార్చివేసినారు. భూములు మీకు ఉచితంగా పంచిపెట్టుచున్నారు. పోరంపోకుగాని, ఖారజికౌలగాని, బంజరాయిగాని మీ గ్రామంలో ఉంటే ఆ భూములు మీరు సేకరించి సేద్యము చేసుకోవచ్చు. భూశాఖవారు కొత్తజరీదాలు అమలులోకి తెచ్చినారు. లావునీచట్టము ప్రకారము హరిజనులు దరకాస్తులు పెట్టుకొని యిట్టి భూములను పొందవచ్చును. జరీదాల అభిప్రాయము యీ క్రింద పొందుపరుస్తున్నాను:—

రెవెన్యూ జరీదా నం. 14 తారీకు 8 నవంబరు 54.

1. ఇప్పటినుండి యీ దిగువ నుదహరింపబడిన భూములు ఏకసాలా లావుని ప్రకారం వ్యవసాయానికి ఇవ్వబడవు. (1) పోరంపోకు, (2) కారజికౌజా (3) పదివంతులు మిన హాయింపబడని అడవిభూమి.

2. ఈ ఆజ్ఞ అడవిజాతులు ఆవరించుకొన్న భూములకు పొందదు.

3. ఒకటవ వరతు ప్రకారం శాశ్వతనేద్య అధికారం పొందవలె నంటే, యీ దిగువ నుదహరింపబడ్డ విధానములను అవలంభించవలెను.

## (ఎ) ఏక్సాలా వ్యవసాయంకొరకు

(1) రెవెన్యూ 58 (ఏ) చట్టమునననుసరించి, తాత్కాలికంగా భూముల నాక్రమించిన హరిజనులకు, వెనుకబడ్డజాతులకు, భూములులేని తదితర పేదజనులకు ఉచితంగా పట్టాలు చేయబడును. ఐతే, ఒక్కొక్కరి కుటుంబానికి నియమితమైన విస్తీర్ణతకు మించి యివ్వబడదు. ఎవరైన అలా ఆక్రమించి ఉంటే, అట్లు అధికంగా ఉన్న భూమి ప్రభుత్వానికి చెందుతుంది.

(2) పైచెప్పబడిన జాతులు కాక, వేరే ఎవరైనా అట్టి భూమిని స్వాధీనపరచ దలంచుకొంటే వారికి రెవెన్యూ సిస్తుకు పదహారు వంతులు ఎక్కువగా లెక్కించిన ధర నియమింపబడును. కుటుంబ నిర్ణయ విస్తీర్ణత వీరికి కూడా చెందును.

## [బి] అనధికారంగా ఆక్రమించిన భూములు

(1) 1949 సంవత్సరానికన్న ముందటినుండి వ్యవసాయము చేస్తూ స్వాధీనపరచుకొని యున్నటువంటి హరిజనులకు పెద్యూలుకొన్న వారికి వెనుకబడ్డకులాలకు, భూములులేని నిరుపేదలకు వారు స్వాధీనపరచుకొన్న భూములు రెవెన్యూ

58 (ఎ) సెక్షను నామోదంచి, కుటుంబ పరిమితి ప్రకారం పట్టా దొరకగలదు.

(2) పైచెప్పబడిన కులాలకు చెందనివారు భూములు స్వాధీన పరచుకొని ఉంటే, అట్టి స్వాధీనము 1952 సం. కు ముందు ఆరేండ్లనుండి గనక అమలులో ఉంటే, అట్టివారికి శిస్తుమీద పదహారురెంతుల ప్రకారం ధర నియమింపబడి ఆ ధర ప్రకారం విక్రయం కాగలదు. వీరికి కూడా కుటుంబ నియమం చెందగలదు.

4. 1949 సంవత్సరం తరువాత అనధికారంగా ఆక్రమించినవారు తొలగింపబడెదరు.

5. భూమి స్వాధీనాన్ని రికార్డుపర్చుటకు, "అమల్ సవాయి జమాబందు" రికార్డుగాని, రెవెన్యూ వారిచ్చిన రసీదులుగాని అవసరం. నోటిమాటలతో పని సాగదు.

6. పదివంతులకన్న తక్కువ వున్న అడవిభూములనైనసరే పట్టాచేసుకొని ఉంటే అట్టి పట్టాలు 12 వ జూలై 1952 నుండి 29 జూను 54 లోపుగా అమలులో వచ్చి ఉంటే, అవి కొట్టివేయబడక అమలులో ఉంటవి. 29 జూన్ 54 సంవత్సరం తరువాత పదివంతులకన్న తక్కువ వున్న సైరాను భూముల నాక్రమించినవారికి పట్టా అధికారం లేదు.

7. పదివంతులుకు పైనవున్న సైరానుభూముల పట్టాగానీ, పైనుదహరింపబడిన జరీబాలప్రకారం యివ్వబడిన భూముల పట్టాగానీ యథావిధిగా వుండగలవు.

8. ప్రతిగ్రామంలో వున్నటువంటి పోరంబోకు, కారజికోతా సైరాను భూములయొక్కయూ, అడవినుండి ప్రత్యేకింపబడ్డ భూములయొక్కయూ, అట్టి భూములలో ఉన్నటువంటి తాడిచెట్లు, ఈతచెట్లు, ఇప్పచెట్లు మొదలగు చెట్ల విస్తీర్ణత గూర్చిన వివరములతో గూడిన జాబితాలు తయారుచేయబడును. ఇవిగాక మినహాయింపబడ్డ భూములు వ్యవసాయకులైన హరిజనులకు, వెనుకబడ్డవారికి భూములులేని పేదలకు కుటుంబనియమితి ప్రకారం రెవెన్యూ 58 (ఎ) సెక్షను, ననుసరించి లావునీ సట్టముక్రింద యివ్వబడును. వీలైనంత వరకు ఎవరు ఏభూమిని సేద్యం చేస్తున్నారో ఆ భూమినే వారికి పట్టాగా యిచ్చే ఏర్పాటుచేయబడును.

9. ఎక్కడనైనా ఒకేస్థలములో విభాగింపబడని విధంగా 50 ఎకరాలుగాని, అంతకన్న ఎక్కువగాఉన్న భూమిగాని ఉన్న భూమి, వ్యవసాయ సహకార సంఘాలకు యివ్వబడును, అట్టి సంఘాలకు భూమి ఈ దిగువనుదహరింప బడ్డ రీత్యా, యివ్వబడును.

1. హరిజనులు, వెనుకబడ్డ జాతులు.
2. వ్యవసాయ దారులైన భూమిలేని పేదలు.
3. కుటుంబ నియమితికన్న తక్కువ భూమిని కలిగినవారు.
4. పశువుల ఉత్పత్తికొరకై భూమి అవసరంగా ఉన్నవారికి.

10. వ్యవసాయమునకు అనుకూలమైన భూములకు పట్టాలు, పై నుదహరింపబడ్డ ఆజ్ఞలప్రకారం, 1954-1955 సంవత్సరం

యొక్క జమాబందికి ముందే ఇవ్వబడి జమాబంది రికార్డులలో ఎక్కించబడవలెను. ఈ షరతులు, ఆజ్ఞలు, ఏతాలూకాలోనైనా అమలు చేయబడకపోతే, ఆ తాలూకాకు చెందిన ప్రభుత్వపు అధికారులు పూచీదారులై ఉంటారు.



# 4. హరిజనుల ఉద్యోగాలు

గవర్నమెంటువారు, యింకొక గస్తీ ప్రచురించినారు. ఆదిఉద్యోగాల విషయం.దాన్ని సంక్షిప్తంగా యీ దిగువ నుదహరిస్తున్నాను.
జీ. ఇ. డీ జరీదా. నెం. 18 తా 21 వ- ఏప్రిల్ 1958.

1. షెడూలుకాస్టువారు నూటికిపద్దెనిమిది ప్రకారము, సర్కారు ఉద్యోగాలలో తీసుకో బడతారు.

2. వీరివిషయంలోమాత్రం,గజటేతర ఉద్యోగాలలో,వయసుపరిమితి 5 ఏండ్ల వరకు విరమింపబడును.

3. షెడూల్ క్లాసు, షెడూల్ ట్రైబువారి పక్షంగా, గజెటుగానీ గజటేతర ఉద్యోగాల విషయంలోగాని, జరుపబడే పోటీపరీక్షలలో నూటికి పదిమార్కులు తక్కువగా లెక్కింపబడును. తక్కిన ఉన్నత జాతులవారితో సమానంగా గాక, వీరికి ప్రత్యేకింప బడిన ఉద్యోగా

లలో వీరు తీసుకో బడతారు. అట్లు తీసుకోబడ్డా, తక్కినవారితో సమానంగా లెక్కింపబడతారు.

4. తాత్కాలికంగా హరిజన అభ్యర్థుల్లోగాని లేకగిరిజనఅభ్యర్థుల గాని, పై నుదరింపబడ్డ ఖాళీలకు అర్హులైనవారు లేకపోతే, ఆ స్థానేకు లీసులను ప్రవేశ పెట్టవచ్చునుగాని, అటు తర్వాత సంవత్సరం, మరల షెడ్యూల్ కాస్టువారికే కాళీలు ప్రత్యేకింపబడి ఉంటవి.
ఈ విధంగా రెండేండ్ల వరకు తగిన హరిజనులు, దొరకక్కపోతే, అట్టి ప్రత్యేకతకొట్టివేయ బడును.

5. కు లీనులతో పాటు సరిసమానంగా నిలచి, హరిజను లఉద్యోగంలో ప్రవేశించ గలిగితే, అట్టిఉద్యోగాన్ని కేటాయింపబడ్డ హరిజనుల ఉద్యోగాల్లో లెక్కింపక, సరిసమానంగా నిలువలేని హరిజనులకొరకై నిలుపు దలచేయబడును.

ప్రతి ప్రభుత్వశాఖవారు, ప్బ్లికు సర్వీసు కమిషనుకుగాని, ఎం ప్లాయిమెంటు ఎక్సచేంజివారికిగాని, వారి వారి ఆఫీసులలో హరిజను లకు కేటాయించిన ఖాళీల విషయమై ప్రకటనలద్వారా లేక ప్రత్యేక లేఖలద్వారా తెలుపుచుండవలెను.

వారిహక్కుల విషయమైన అప్లికేషన్లను ప్రభుత్వంవారు జాగ్ర తగా ఆలోచించవలెను. హరిజనులు విద్యలో తక్కువబడిఉన్నందున, ప్రభుత్వపు ఉద్యోగాలలో ప్రవేశించ లేకపోవుటచేత, వారు సునా యాసంగా కొలువులలో చేరగలిగే కొన్ని సదుపాయాలను ప్రభుత్వం వారు ఏర్పాటు చేసినారు. దానినిబట్టిచూస్తే సర్కారి ఉద్యోగులలో నూటికి 18 మందిని హరిజనులను తీసుకోవలసి యున్నది. ఇది అసలు

జరుగుతూఉంది. ప్రతిశాఖలో కాళీలుఉంటవి, వాటిపంపకము పై నుదహరించిన గష్తిప్రకారము జరుగు చుండును. కొలువులు కాళీగా ఉన్నవని తెలిసిన వెంటనే, అర్హులైన హరిజనులు దరకాస్తులు పెట్టుకొని కృతార్థులు కావలెను. కాళీగాఉన్నకొలువుల విషయమై ప్రభుత్వశాఖవారు పత్రికలో ప్రకటిస్తుంటారు. అట్టిప్రకటనల ప్రకారము అప్లికేషన్లు పెట్టుకొనినచో ఉద్యోగాలు తప్పక దొరకగలవు. హరిజనులకని కొన్నిఉద్యోగాలు కేటాయించ బడ్డట్లుకూడా ప్రకటనలు ప్రచురింప బడుచుంటవి. కొలువులు సేకరింపవలసిన విధానములుకూడా వ్రాయబడి ఉంటవి. న్యాయము తప్పక జరుగును. హరిజనులెందరో ఈవిధంగా కొలువుల్లో ప్రవేశిస్తున్నారు, కొన్ని మారులు అన్యాయము జరగవచ్చు మీలోమీరు నణిగి, గొణిగి, నిరాశాపరులై ప్రభుత్వాన్ని దూషించి, అధికారులను తిరస్కరించి, ప్రభుత్వమేమిచేయు చున్నది. నాయకులేమి చేస్తున్నారు, కాంగ్రెసువల్ల ఏమి ప్రయోజనమని దుష్ ప్రచారము సాగించవద్దు. అన్యాయం జరిగినచో వెంటనే అధికారులకు వ్రాయండి. ఉత్తర ప్రత్యుత్తరాలు సాగించండి. ముఖ్యమంత్రికి వ్రాయండి. కాంగ్రెసు ప్రధానికి వ్రాయండి. రాష్ట్రపతికి వ్రాయండి, ప్రధానమంత్రికి వ్రాయండి, మీకు న్యాయము జరుగువరకు వ్రాస్తునేఉండండి. ఇది విజయానికి మార్గము. ఎడతెగక అడగండి, ఒక్కసారి అడిగిఊరుకోరాదు, ఇది గొప్పపోరాటమని గ్రహించండి. మీ ఉద్యోగాలు మీకాళ్ల కడకురావు, ఉద్యోగాలు సేకరించుటకు గొప్పపరిశ్రమ చేయవలెను.



# 5. మీ గ్రామసీమ

ఇక మీ గ్రామాల సంగతి కొంత విచారిస్తాము. సాధారణంగా, హరిజనుల బస్తీలలో, గ్రామాల్లో, మంచినీళ్ళ బావులుండుట అరుదు. కాబట్టి సమీపానఉన్న మురికికాలవలనీళ్లు త్రాగుచుంటారు. అందు చేత మీ ఆరోగ్యం తప్పక చెడిపోవును. మీ పిల్లలు ఎల్లప్పుడు నవసిపోతూ ఉంటారు. కాబట్టి మంచినీళ్ళ బావులు త్రవ్వించే ప్రయత్నాలు చేయండి, మీ జిల్లాలలోని సోషల్‌సర్వీస్ ఆఫీసరులను సమీపించి హరిజన గ్రామాలలోని పరిస్థితి తెలుపండి. బావులుత్రవ్వించుటకై వారి దగ్గర తగినంత ధనముఉన్నది. దానితో బావులు త్రివ్వించుకోవచ్చును. అదేవిధంగా, హరిజనుల పూరిగుడిసెలు కూలినట్లైతే, కప్పులు వేయించుకొనుటకు, డబ్బునుపొందంటి. ఇంటిమరామత్తులు చేసుకోండి. హరిజనబస్తీలలో, యింటిమీద యిల్లుకట్టబడి ఉంచుట సహజము కాబట్టి విశాలమైన స్థలములలో పునః గృహనిర్మాణం కొరకై ప్రభుత్వం వారికి వ్రాసుకొండి. మీ గుడిసెల కప్పులు కూలిపోతే, క్రొత్త కప్పులకై సోషల్‌సర్వీస్ ఆఫీసరు మీకు ధనసహాయం చేస్తాడు.

మీ పిల్లలను చదివించుకొనే శక్తిలేకపోతే భయపడవద్దు. మీ పిల్లలకు ఉపకారవేతనాలు తప్పకదొరుకును. ప్రభుత్వంవారు "హిందూవ్యాలు కాస్టు ట్రస్టుఫండ్" అనుపేరున ఒకనిధిని ఏర్పాటుచేసినారు. దాని ద్వారా పిల్లలకు బడిజీతాలు దొరుకును. ఈ నిధివల్ల విద్యార్థుల వసతి గృహాలు ప్రతి జిల్లాలో ఏర్పాటు చేయబడినవి. అవి హరిజనులకై ప్రత్యేకింప బడినవి. ఈ సంగతి ప్రతిజిల్లాలోని విద్యాశాఖ యొక్క-

ఇన్స్పెక్టరుకు తెలిసి యున్నది. విద్యార్థి వేతనాలు సేకరించుటకు కొన్ని ఫారాలు ఉన్నవి. వాని ద్వారా మీరు మీ బాలికా బాలురకు రుసుములు సేకరించవచ్చును. ఏ తరగతి బాలురకెంత ప్రభుత్వం వారు నియమించినారో తెలుసుకోండి. నియమిత ధనముకన్న తక్కువ దొరికితే వెంటనే అధికారులకు వ్రాసి తెలుసుకోండి. హైదరాబాదు నగరములోఉన్న సోషల్ సర్వీసు డైరెక్టరుగారికి వ్రాయండి. ప్రతి జిల్లా లోఉన్న సోషల్ సర్వీస్ ఆఫీసర్లకు వ్రాయండి, జవాబు దొరుకు వరకు వ్రాయండి, ఊరుకోవద్దు, ఎడతెగక ప్రయత్నం చేయండి. జవాబు వచ్చువరకు వ్రాయండి. ఉత్తర ప్రత్యుత్తరాలకు మీ యొద్ద డబ్బు లేదా, డబ్బు లేదనేకుంటి సాకు చెప్పవద్దు. చందా వేసుకోండి. పని చేయండి. రాత్రి బళ్లు తెరవండి. పెద్దలవిద్య నేర్పండి. దీనికి సర్కారు వారు సహాయం చేస్తారు అడుగండి అడుగందే ఏదీ దొరుకదు.



# 6. సేవకు, కులములేదు



మీరు ఉన్న ఊరిలోని నిష్ఠా గరిష్ఠులైన సవర్ణులు మిమ్మల్ని దేవాలయాలలోనికి రానియ్యక పోవచ్చు. లేక ఊరి బావులలోని నీళ్లు తోడుకొననియ్యక పోవచ్చు. మంచిదే, మీరందరు గుంపుగా పొండి. ఆలయాలలో ప్రవేశించండి. భక్తి తాత్పర్యములతో పూజలు చేసుకోండి. ప్రజలు మిమ్మల్ని కొట్టినా తిట్టినా ఊరుకోండి. వారు కొట్టే దెబ్బలు మీ తలలపై తైలాభిషేకాలు, వారి తిట్లు మీకు ఆశీర్వనాలు, సంతోషించండి, కాని వెనుకంజ వేయకండి. దెబ్బకు దెబ్బ, తిట్టుకు తిట్టు పనికిరాదు. అన్యాయాలు జరుగుతూ ఉంటే, ప్రభుత్వం వారు నిద్రపోతూ ఉంటారనుకోకండి, వారు వెంటనే చర్యతీసుకొంటారు, చట్టము ప్రకారము వారికి తీర్పు తీర్చబడును,

అదే విధంగ, బహిరంగ బావులలో నీళ్ళు తోడుకొననియ్యక పోతే, అందరుకలసి తోడుకొండి. ఐతే సవర్ణులను తిట్టవద్దు. అవమానంగా మాట్లాడవద్దు, స్త్రీలతోఅమర్యాదగా నడుచుకొనవద్దు. మీసత్ప్రవర్తననుబట్టి, మీ యోగ్యతనుబట్టి, మీ సుగుణాలనుబట్టి, సవర్ణులు తమకఠిన హృదయాలుమార్చుకొంటారు. అంతే మానవులహృదయాలు, రక్తపు గుండెలే గాని రాతిగుండెలుకావుగదా! ఈ విధంగా మీకు విజయంకలుగుతుంది. ప్రేమ అనే ఖడ్గము మీ చేతిలో ఉండాలి.

సవర్ణులు ప్రేమవిడిస్తే మీరు విడువరాదు. ప్రేమజయించినట్లుగా ఆటంబాంబులు జయించలేవు. ప్రేమదైవత్వం. అది ఉజ్వలశక్తి. దానికి నీవు నేనను విత్యాసంలేదు.

ఆ. వె. అధములో అధికులో అమిత దుర్మార్గులో
పురుషులో స్త్రీలో నా కెఱుకపడదు
సవునేసను దుష్టభావంబు నావెంట
రాదు నాదారి నిరామయంబు.

అటువంటిది ప్రేమమార్గం. పేదలు మీలోనే కాదు, తదితర జాతులలోకూడ ఉన్నారు. వారి పట్ల జాలి కలిగి ఉండండి. వారికి కూడా సహాయపడండి. సేవకు, కులగోత్రాలు అనే భేద భావాలు ఉండవు. ఐతే, హరిజనులకు సేవ మొదటచేయండి. ఎందుకనగా, యుగయుగాలనుండి వారు పడిపోయి ఉన్నారు. వారిని లేవనెత్తిన వారు లేరు. ఉద్ధరించినవారు లేరు. మన భారత దేశంలో ఎన్ని వేల హరిజనులు చికిత్సఅనగా ఏమిటో తెలియక, ఆరోగ్య మార్గము ననుసరించక, ఏటేట చనిపోవుచున్నారో గ్రహించితిరా? గ్రామాలలో ప్రసూతిచికిత్స లేకపోవటంవల్ల, ఎంతమంది హరిజనస్త్రీలు బాలింత రోగాలవల్ల చనిపోయేది మీ కెరుకపడిందా! డాక్టరులుగాని, దాయలుగని లేనందున, మంగలి మంత్రసానులపై నాధారపడి, దౌర్భాగ్య స్థితిలో మరణించుచున్న హరిజన స్త్రీల లెక్క ఎవరికైనా తెలియునా? అట్టి స్త్రీలను ఎప్పుడైనా మీ జిల్లాలోని ఆస్పత్రులలోకి తీసుకొని పోయే ప్రయత్నాలు చేసినారా? వైద్యశాఖా మంత్రిగారికి మీ ఊళ్లో ఆస్పత్రి అవసరమని వ్రాసినారా? లేని పక్షానికి వెంటనే వ్రాసుకోండి. హరిజన స్త్రీలకు దాయీల తర్ఫీతు నేర్పించండి. ప్రభుత్వంవారు, వారికి ఉచితంగా తర్ఫీతుయిస్తారు. అట్లు తర్ఫీతు పొందిన హరిజన స్త్రీలు మీ ఊళ్లోఉంటే, మీ గ్రామములోని స్త్రీలకు గొప్ప సహాయం కలుగ గలదు.

మీ గ్రామాదులలోని చిన్నపిల్లల ఆరోగ్యాన్ని గూర్చి కొంత జా గ్రతగా విచారించండి. చిన్నపిల్లలు రోగ పీడితులైతే గొడ్డుపవలె, కడుపులుకాల్చి వాతలు పెడతారు. అదితప్పు. మహాఘోరమైన పని. చికిత్స చేయించండి, ఆ జాగ్రత చేయవద్దు.

కలరా, మశూచికము, ప్లేగు, మొదలగు జాడ్యములు ఏటేట మీ గ్రామాలలో చెలరేగు చుండునుగదా! ఇట్టి వ్యాధులు వచ్చుటకు కారణమేమిటా అని విచారించుటకు మారుగా మంత్ర తంత్రాలను నమ్మి హరిజలను బాదిస్తారు. పంబాలవాడు మంత్రశక్తి చేత కలరా లేపినాడని, వానిని వానిచుట్టపక్కాలను అమానుష్యంగా హింసిం చుటయేగాక, కొన్నిమారులు, అనుమానించిన పంబాలవాళ్లను జీవములతో పాతి పెట్టుచున్నట్టు తార్కాణము లున్నవి. ఇట్టి అమానుష్య కృత్యాలను పుటమార్చుటకు మీ రెట్టిప్రయ త్నాలు చేయుచున్నారు? యువకులారా! మేల్కొన పడండి. జాగరూకులై చూడండి, చురుకుగా ఆలోచించండి. ఇట్టి మూఢ విశ్వాసాలను పటాపంచలు చేయుశక్తి మీలోనుంది. కాని, ఒంటరిగా, ఒక్కరొక్కరుగా మీరేమిచేయలేరు. ఏకీభవించండి. తప్పును ఖండించండి. సత్యాగ్రహపరులై, దురాచారాలను దునుమా డండి. న్యాయమునకై పోరాడండి. సత్యాన్వేషులై పోరాడండి.



# 7. మధుసేవ

మరొక విచారకమైనదియూ విచారణీయమైనదియూ నగు విషయం, మధుసేవ. కల్లు సారాయీలవల్ల పేదజనుల పండువంటి సంసారాలు పాడై పోతున్నాయి. భూములు, మేడలు, కుదువకట్టు కిందికి పోతున్నాయి. ధనికులు దరిద్రులగుచున్నారు. పేదలు మరీ పేదలై భిక్షాటనచేస్తున్నారు. ప్రభుత్వంవారు, మధుపాన నిషేధాన్ని కొన్ని ప్రాంతాలలో ప్రవేశపెట్టినారు. బలవంతంగాచేయించినపని ఏపని కూడా ఫలవంతంగాదు. హైదరాబాదు స్టేటులో మధుపాన నిషేధపు చట్టము ప్రవేశం కాలేదు. అట్టిబిల్లులు తయారుకాకముందు మానవుల హృదయాలను తయారు చేయవలెను. ప్రజలే తమయిష్ట ప్రకారం, త్రాగమని తీర్మానించుకోవలెను. నేనుముఖ్యంగా హరిజనుల నుద్దేశిస్తున్నాను. త్రాగుబోతుతన మనేది మీలో గాఢంగా ఊడలు పారిపోయినది. దాన్ని ఊడబెరుకవలెను. అది మీ ఆర్థిక స్థితిని చక్కబడనిచ్చుటలేదు. మీ అనుదిన ఆహారానికే అడ్డంకులు కలిగిస్తుంది.

చిన్నలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు, చంటి పిల్లలుకూడా, సాయంత్రపువేళ, కల్లు అంగళ్లలోచేరి. యిష్టాగోష్టిగా త్రాగుచుంటారు. పట్టణాలలో బాలికా బాలురకు "టీ" త్రాపినట్లుగా, పల్లెల లోని చిన్నపిల్లలకు, వారితల్లిదండ్రులే, మురిపానికి, కల్లు త్రాగించుట చూచినాను. ఇది క్షమింపబడని ద్రోహము. అమాయకులైన చిన్న పిల్లలకు, వారి పసితనముందె. త్రాగేఅలవాట్లు నేర్పుటకన్నా, గొప్ప

ద్రోహమున్నదా! ఇటువంటి అలవాట్లు మీలో ఉంటే, వాటిని వెంటనే తీసి వేయండి. వెనుకబడ్డవారికి నీ, త్రాగుడు తప్పుగాదనుకొన్న వారికి, మీరు ఉపదేశం చేయండి. దానివలన కలిగే పర్యవసానాలను వారికి విశదీకరించండి. లోకములో జరిగే హత్యలు, ఖూనీలు, దొంగతనాలు, ముప్పాతికమువ్వీసం, త్రాగుడువల్ల జరుగుతున్నాయి. భార్య భర్తలు విడిపోవుటకిదే కారణం, హరిజన బస్తీలలో అకారణంగా, జగడాలు రేగుటకు మధుపానమే కారణం.

విచారకరమైన సంగతి ఏమిటంటే, మీ గ్రామాల్లోని, పంచాయతీ దారులు, ఏదైన ఒకసమస్యను తీర్మానించితే, తప్పితస్తులైన వ్యక్తులద్వారా జరిమానగా స్వీకరించిన ధనాన్ని, మధుపానానికివినియోగిస్తున్నారు. పెద్దలైనవారే యీలా తప్పుడు నడకనడిస్తే, తక్కినవారి గతేమి? కాబట్టి, యువకులారా. మీరుముందుకు రండి. నాధైర్యము, విశ్వాసము మీ పైనఉంది. పెద్దలు వృద్ధులైనారు. పండుబారినారు. ఇప్పుడో రేపో ఊడిపోతారు. వారుచేసే పనులు మీ భుజముల మీద పెడుతున్నాను. ఈ గొప్పఅధికారాల్ని గ్రహించండి. కల్లుసారాయి నల్లమందు, గంజాయి, మొదలగు మత్తుపదార్థాలను తృణీకరించండి. దీనికి ప్రతికూలంగా మీరు మీవాడల్లో పలుమారు ప్రసంగించండి. వీనినిగూర్చి చిన్న చిన్న గ్రంథాలు ప్రకటింపబడినవి. వానిని గ్రంథాలయాలలో ఉచితంగా చదువుకోవచ్చు. త్రాగుబోతుల బిడ్డలు, అంగహీనులై పుడతారని శాస్త్రవేత్తలనుచున్నారు. కాబట్టి యీ విషయాన్ని ఎల్లప్పుడు మీ దృష్టియందుంచుకొండి.

ఈ త్రాగుబోతుతనానికి సంబంధించిన మరొక విషయమున్నది. అది మృతజంతు కళేబరభక్షణం. చచ్చినపశువుల మాంసమును కొం

దరు భక్షిస్తున్నారు. ఇంతటికన్న అమానుష్యమగు కార్యము లేదు. దానివల్ల ఆరోగ్యముతప్పక చెడిపోతుంది. రెండవది, నాగరికులైనవారు హరిజనులైనా, హరిజనేతరులైనా, చచ్చినదానిని తినువారిని దగ్గరకు రానియ్యరు.

అసలుమాంస భక్షణమే మంచిదికాదు. పైగా, మృత కళేబరాలను తినడ మనేది రాక్షసిగుణము. అటువంటి అలవాటు లున్నవారికి హితవులు చెప్పండి. అది తప్పఅనేసంగతి వారికి తెలియక పోవచ్చు లేదా ఆర్థిక దురవస్థవల్ల అలాచేస్తున్నారేమో. యావన నాయకులారా, చూడండి, మీ మీద ఎంతగొప్ప భారమున్నదో, ఎన్నెన్ని పనులు మీరు చేయవలసిఉందో! ఇన్నాళ్ళు, మీరు సోమరులై వీధుల్లో కిళ్ళీలు నవులుతూ తిరుగుచుంటిరి, ఇప్పుడు పరిస్థితులు మారినవి, మీ మనసులో భాద్యతా యుతమగుకొన్ని నూతనాభిప్రాయాలు ప్రవేశించినవి, చైతన్యం కలిగింది. చలన మేర్పడినది. ఆలోచించండి, కార్యసిద్ధులుకండి, ఇకసమయంలేదు, దీపమున్నది. అది ఆరిపోక ముందే, మీ యిల్లు న[illegible]చుకోండి. స్వాతంత్ర్యం కలిగి దాదాపు ఏడు సంవత్సరాలైనది. భారతదేశంలోని జాతులన్నియు ముందుకు సాగుచున్నవి. అత్యోన్నతమైన స్థానానికి అవి పరుగు లిడుచున్నవి, ఇప్పటికే ఏడవమెట్లు అవి ఎక్కినవి. మీరు ఏమెట్టు మీద ఉన్నారు? తిరిగి చూడండి. లెక్కబెట్టండి. ఏడవ మెట్టుమీద ఉన్నారా? చాలా విచారకమైన విషయం. రెండవమెట్టుదాటి మూడవ దానిపైని అడుగు పెడుతున్నారు. తక్కినవారందరు చాలాముందుకు పోయినారు. వారిని కలుసుకో గలుగుతామా. ఆలా, కలుసుకో వలెనంటే, యింకా మూడు ఏండ్లలో కలుసు కోవలె, ఎందుకంటే భారత

రాజ్యాంగం ప్రకారం, 10 సంవత్సరాలు, హరిజనులకు ప్రత్యేకత కలదు. ప్రతి ప్రగతి, యీ ప్రత్యేకత ననుసరించి లభింపనున్నది. ఏడేండ్ల లో కలుగని ప్రగతి, యింక మూడేండ్లలో కలుగ బోవునా అని సంశయ పడవద్దు. అది మీ చేతుల్లోఉంది. మీ యొక్క ప్రయత్నాలలోని పరిభ్రమణ వేగమునుబట్టి మీ యొక్క ఫలితము నియమింపబడును. అందరు ఏకమై ముందుకు పోతే, విజయవంతులము తప్పక కాగలము. కాబట్టి, చాటింపండి, అష్టదిగ్భాగాలకు మీ వార్తను ప్రకటించండి.

కులమనే కొండల్ని కూలగొట్టెయ్యండి
అంటరాని తనాన్ని మంటిలో గలపండి
సకల మానవకోటి సరిమానత్వాన్ని
శంఖార వంబుతో చాటండి, చాటండి!

గజమెక్కి పిలువండి, గంటలు గొట్టండి
ప్రతియూరి వారికి, ప్రకటించి చెప్పండి
మీరు తక్కువవారు కారు, కానేకారు
గాన పోదామోయి, గమ్య స్థానానికి॥

ఏశాసనాలైన, ఎవరుపై కొచ్చినా
దళితజాతుల జూచు, దాతలు లేరండి
పరులపై నాధార పడరాదు, మీ జీవి
తొలుమీ వల్లనే, తొండ వించాలండి॥



# 8 దళిత జాతి సంఘం

ఇటువంటి సేవ ద్వారా, మీరు, మీ గ్రామాలలో నాయకులై పరి జలగౌరవ వార్హులై జీవింపగలరు. మీ నాయకత్వంపై మీ ఊరివారంతా ఆధారపడి ఉంటారు. ప్రతిచిన్న విషయం మీతో సంప్రతిస్తారు. అప్పుడు మీ జాతివారిని, మీ గ్రామం చుట్టుకు, ఒక సభ రూపంగా లేక సంస్థగా ఏర్పాటు చేయవచ్చు. అట్టి సంస్థకు ఒక మంచి పేరు పెట్టండి. అట్టిదే దళితజాతిసంఘం. అదిఏమిటో మీకు తెలియకపోవచ్చు. ఇది అఖిల భారతీయ సంస్థలో ఒక శాఖ. దాని పేరు అఖిలభారత నిమ్న జాతిసంఘం. దీనిని శ్రీ బాబుజగ్‌జీవన్‌రాం ఢిల్లీలో స్థాపించినారు. కాబట్టి నీవున్న ఊళ్లోనే దళితజాతిసంఘము యొక్క శాఖను ఏర్పాటుచేస్తే, నీకు తెలియకరయే, అఖిల భారత సంస్థలో ఒక ముఖ్యమగు అంగుగా భావింపబడతావు. దానివల్ల యింతకుముందు నీకు లేని ఘనత, గౌరవము, కలుగుతుంది. అనుదిన ప్రవర్ధమానంగా అనుభవము కలుగును. ఈ దళితజాతిసంఘంలో ఎవరెవరు సభ్యులు కాగలరని మీరు విచారించవచ్చు. హరిజనులలోని అన్నిరకాల ఉప జాతుల వారందరు దీనిలో చేరవచ్చు, చేరినారు, యింకా చేరుచునే ఉన్నారు. కాబట్టి మీరు చేరండి. దీనిలో చేరినతరువాత బేదభావాలుపోయి ఐకమత్య మేర్పడుచుండును.

ఈ దళితజాతి సంఘానికీ కాంగ్రెసుకూ దగ్గర చుట్టరికమున్నది. అసలు కాంగ్రెసులో ఇది ఒక భాగముగా భావింప బడుచున్నది. కాంగ్రెసెక్కడా, దానిలోమనము చేరితే, మనల్ని కాంగ్రెసు నలిపి

పారేస్తుందనే భయం మనకుండరాదు. ఎందుకంటే మనకు స్వాతంత్ర్యం కలిగింది కాంగ్రెసువల్లనే. కాంగ్రెసుకు గౌరవంకలిగేది మనల నుద్ధరించటంవల్లనే. కాంగ్రెసువల్లనె విదేశబంధనాలు తొలిగిపోయాయి! కాంగ్రెసు పరిచంపమైన సంస్థ. దీని తత్వం, అసహాయులను రక్షించుట, దానివల్లనే మనకు సుఖజీవనం కలుగుతోంది. మీరు కాంగ్రెసు కొరకు ఎక్కువగా పనిజేస్తే, ప్రతికాంగ్రెసు శాఖలో మీకు పలుకుబడి కలుగుతుంది. దళితజాతి సంఘ సభ్యులైతే, కాంగ్రెసుతో ఏకీభవించిన వారికి విజయం తప్పదు. దళితజాతి సంఘం యొక్క ఉద్దేశం, మహా గంభీరమైనది. అణచి వేయబడ్డజాతులను పైకిలేవదీసి, కులీనులనబడ్డవారితో సరిసమానంగా చేయుటయే దీని పట్టుదల. హైదారాబాదు రాష్ట్రములోని ప్రతి జిల్లాలో, ప్రతి తాలూకాలో, ప్రతిగ్రామంలో దళితజాతి సంఘంయొక్క శాఖ స్థాపింప బడుచున్నది. దళితజాతికి సంబంధించిన రచనలు, గేయాలు, హరికథలు, బుర్రకథలు, నాటకాలు. విరివిగా తయారు అవుతున్నాయి. మీలో వ్రాయగలిగిన వారుంటే, వ్రాయండి. దళిత సారస్వతాన్ని పెంపొందించండి. కవులు, గాయకులు, నటకులు, మీలోఉంటే, బయటికి రండి. మీకు చేయూత వొరుకును.

లెండోయి, లెండోయి, లెండోయి, లెండోయి,
దండులేచిపోయే లెండోయి, లెండోయి,
తేరుతరలిపోయే, లెండోయి, లెండోయి,
తెల్లవారిందింక, తెలివొంది లేవండి॥

మీయిల్లు, మీవాడ మీజీవితాలన్ని
కూలి కుమిలిపోయే, గేళిపాలైపోయే

కూడు గుడ్డలులేక పాడైన గతేమి
గాఢనిద్రావస్త కప్పుకొన్నదిగాన. లెండోయి॥

తూర్పుకొండలపైని సూర్యుడుదయించాడు
మారిపోతుంది భూమండలంబేకమై
కులములు, గోత్రాలు, కలుములు లేములు
తలక్రిందులై విప్లవాలు దొరలెనుగాన. లెం॥



*Under Print*

## APPEAL TO NON-HARIJANS

## హరిజనేతరులకు విజ్ఞప్తి



*Apply For Copies to:*

**Kalyan Rao Ninne,** M. L. A.,

*Manager*

Dallit Literature Society,

No. 10 M. L. A. Quarters.

**Hyderabad.**



Printed at:

Sadhana Printery, Bagh Lingampalli, Hyderabad-1.